శ్రీరస్తు.

# నీతిశాస్త్రము.

తాత్పర్యసహితము.



పబ్లిషర్సు:-

రామా అండ్ కో,

హెడ్డాఫీసు:—ఏలూరు, కృష్ణాజిల్లా.

1918, జనవరి.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

 [వెల 0-2-6.

శ్రీరస్తు.

# నీతిశాస్త్రము.

## ఆంధ్రతాత్పర్య సహితము.

శ్లో. సభాకల్పతరుం వన్దే వేదశాఖోపజీవితమ్,
శాస్త్రపుష్పసమాయుక్తం విద్వద్భ్రమరశోభితం. 1

తా. వేదము లనుకొమ్మలచే వృద్ధి పొందింపఁబడినదియు, శాస్త్రములను పుష్పములతోఁగూడినదియు, పండితులనెడుతుమ్మెదలచేఁ బ్రకాశింపఁజేయఁ బడినదియు అగుసభ అనెడి కల్పవృక్షమునకు నమస్కరించుచున్నాను.

శ్లో. ప్రణమ్య సర్వలోకేశం దేవదేవేశ్వరం హరిమ్,
నీతిశాస్త్రం ప్రవక్ష్యామి సర్వశాస్త్రార్థసమ్మతమ్. 2

తా. సకలలోకములకు ఈశ్వరుఁడును, దేవతలకు ప్రభువును అగు విష్ణుభగవానునకు నమస్కరించి సకలశాస్త్రముల అర్థమునకు సమ్మతమగు నీతిశాస్త్రమును చెప్పుచున్నాను.

శ్లో. సత్యం మాతా పితాజ్ఞానం ధర్మోభ్రాతాదయాసఖా,
శాంతిః పత్నీ క్షమాపుత్రః షడేతే మమ బాంధవాః. 3

తా. సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము సోదరుఁడు, దయమిత్రుఁడు, శాంతి భార్య, ఓరిమి కొడుకు-ఈ ఆఱుగురును, నాకు బంధువులు.

శ్లో. ప్రాణం వాపి పరిత్యజ్య మానమే వాభిరక్షతు,
అనిత్యో భవతి ప్రాణో మాన ఆచంద్రతారకమ్. 4

తా. ప్రాణమునైనను విడిచి మానమునే రక్షించుకో వలయును. ప్రాణము నిత్యము కాదు. మానము చంద్ర నక్షత్రము లుండువఱకు నుండునది.

శ్లో. నిమంత్రణోత్సవావిప్రాగావ్రో నవతృణోత్సవాః
భర్త్రాగమోత్సవా నార్యస్సోఽహంకృష్ణ! రణోత్సవః. 5

తా. కృష్ణా! బ్రాహ్మణులు పరులయింట భోజనము ఉత్సవముగాఁ గలవారు. గోవు లేఁతగడ్డి ఉత్సవముగాఁ గలది. స్త్రీలు పెనిమిటిరాక ఉత్సవముగాఁ గలవారు. నేను యుద్ధము ఉత్సవముగాఁ గలవాఁడను.

శ్లో. మాతృవ త్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్,
ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పణ్డితః. 6

తా. పరస్త్రీని తల్లివలెను, పరధనమును మన్నువలెను, సకలభూతములను తనవలెను, ఎవడు చూచునో వాఁడే పండితుఁడు.

శ్లో. అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః,
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః. 7

తా. దేహములు నిత్యములు గావు. ఐశ్వర్యము శాశ్వతముకాదు. మృత్యువు నిత్యమును సమీపించియే యుండును. కాఁబట్టి ధర్మమును సంపాదించుకో వలయును.

శ్లో. ఋణాగ్ని ర్వ్యాధి శత్రుశ్చ జ్ఞాతిశేషంచ పంచకం,
పునఃపునః ప్రవర్ధంతే తస్మాచ్ఛేషం నకారయేత్. 8

తా. అప్పుయొక్కయు, రోగముయొక్కయు, విరోధులయొక్కయు జ్ఞాతులయొక్కయు మిగిలిన శేషము, మరలమరల వృద్ధియగును గాన శేషముంచరాదు.

శ్లో. విశాఖాన్తానిమేఘాని ప్రసూతాంతాని యౌవనమ్,
మరణాన్తాని వైరాణి యాచనాన్తాని గౌరవమ్. 9

తా. విశాఖకార్తితో మేఘము లంతము పొందును. ఒకబిడ్డను గనిన తోడనే స్త్రీయొక్క యౌవన మంతముపొందును. శత్రువుయొక్క మరణముతో వైరమంతముపొందును. ఒకసారి యాచించుటతో మనుజుని గౌరవ మంతముపొందును.

శ్లో. యస్యమాతాగృహేనాస్తి భార్యాచా ప్రియవాదినీ
అరణ్యంతేనగంతవ్యం యథారణ్యంతథాగృహం. 10

తా. ఎవనికిఁ దల్లియు, నిల్లును లేవో, ఎవనికి వికటముగా మాటలాడు పెండ్లముండునో వాఁడు అడవియందు నివసించుట మేలు. వానికి ఇల్లును, అడవియును ఏకరూపము లే.

శ్లో. అనృతం సాహసంమాయా మూర్ఖత్వమతిలుబ్ధతా,
నిష్ఠురం నిర్దయత్వంచ స్త్రీణాంస ప్తస్వభావతః. 11

తా. అబద్ధము, సాహసము, మాయ, మూర్ఖత్వము, అతిలోభితనము, కఠినముగా మాటలాడుట, దయ లేకుండుట, ఈయేడును స్త్రీలకు పుట్టుకతోనుండెడు గుణములు.

శ్లో. ప్రాతఃకాలేఫలాధిక్యం చోర్ణాధిక్యంతు మధ్యమం,
పర్ణాధిక్యం భవేద్రాత్రే తాంబూల మితిలక్షణమ్. 12

తా. ఉదయమున పోకచెక్క యెక్కువగను, మధ్యాహ్నమున సున్నమెక్కువగను, రాత్రిపూట ఆకులెక్కువగను తాంబూలమును సేవించు లక్షణము.

శ్లో. ఔదుంబరాణి పుష్పాణి శ్వేతవర్ణంచ వాయసమ్,
మత్స్యపాదం జలేపశ్యే న్ననారీ హృదయస్థితిమ్. 13

తా. మేడిపువ్వులనైనను, తెల్లని కాకినైనను, నీటిలో చేఁపల అడుగులనైనను, చూడవచ్చునేకాని స్త్రీల మనస్సులోని సంగతిని ఎవ్వరును చూడఁజాలరు.

శ్లో. దుర్భిక్షే చాన్నదాతారం సుభిక్షేచ హిరణ్యదమ్,
చతురోఽహం నమస్యామి రణే ధీర మృణే శుచిమ్. 14

తా. కఱవు రోజులలో అన్నము పెట్టువారికిని, పండిన రోజులలో ధనమిచ్చువారికిని, యుద్ధములో వెనుకకు మరలనివానికిని, అప్పులేనివానికిని-ఈనలుగురికిని నమస్కారము చేయుదును.

శ్లో. విప్రహస్తేధనందద్యాత్ స్వభార్యాయాం చయౌవనమ్,
స్వామికార్యేషు చప్రాణం నిశ్చయో మమ మాధవ! 15

తా. కృష్ణా! తనధనమును బ్రాహ్మణాధీనము చేయుట, తనయౌవనమును భార్య యధీనము చేయుట, తనప్రాణ

మును స్వామికార్యములో వినియోగపఱచుట. ఇది నా నిశ్చయము.

శ్లో. సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్,
షణ్ణాం రసానాం లవణం ప్రధానం
భవేన్నదీనా ముదకం ప్రధానమ్ 16

తా. దేహమంతటికి శిరస్సు, అన్ని యింద్రియముల లోకన్ను, ఆఱురసములలో ఉప్పు, అన్నినదులలో నీరు ప్రధానమైనవిగా తెలియవలయును.

శ్లో. మృత్పిణ్డ ఏకో బహుభాణ్డరూప
స్సువర్ణ మేకం బహుభూషణాని.
గోక్షీర మేకం బహుధేను జాత
మేకః పరాత్మా బహుదేహవర్తీ. 17

తా. ఒక మంటిముద్ద అనేకములగు కుండల రూపమగును. నగలు వేఱువేఱైనను బంగారుఒక్కటియే చాలనగలగును. ఆవులు వేఱైనను పాలొక్కటియే, అట్లేపరమాత్మ ఒక్కడే. అనేక దేహములై కన్పడును.

శ్లో. అర్థాతురాణాం న గురు ర్న బన్ధుః
కామతురాణాం నభయం న లజ్జా,
విద్యాతురాణాం న సుఖం న నిద్రా
క్షుధాతురాణాం న రుచి ర్న పక్వమ్. 18

తా. ధనాతురులకు గురువుగాని బంధువులు గాని లేరు. కామాతురులకు భయముగాని సిగ్గుగాని ఉండవు. చదువునం దాశగలవారికి సుఖముగాని నిద్రగాని ఉండవు. ఆఁకలి గొన్నవారికి రుచిగాని పక్వముగాని ఉండవు.

శ్లో. దాతా దరిద్రః కృపణో ధనాఢ్యః
పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః,
రాజాఽ కులీన స్సుకులీచ భృత్యః
కలౌ యుగే షడ్గుణ మాశ్రయంతి. 19

తా. దాత దరిద్రుఁడౌట, లోభి ధనవంతుఁడగుట, పాపాత్ముఁడు చిరాయువగుట, పుణ్యాత్ముఁడు చచ్చిపోవుట, నీచుఁడు రాజగుట, ఉత్తమకులుఁడు సేవకుఁడగుట, ఈ ఆఱు గుణములు కలియుగము నాశ్రయించి యున్నవి.

శ్లో. భార్యావియోగశ్చ జనాపవాదో
ఋణస్య శేషః కుజనస్య సేవా,
దారిద్ర్యకాలే ప్రియదర్శనంచ
వినాఽగ్నినా పఞ్చ దహన్తి చిత్తమ్. 20

తా. భార్యతో వియోగము, జనులవలని అపవాదము, ఋణశేషము, నీచులసేవ, లేమికలిగినపుడు ఇష్టులదర్శనము, ఈ అయిదును అగ్ని అక్కఱలేకుండనే మనస్సును కాల్చును.

శ్లో. పుస్తకం వనితా విత్తం పరహస్తగతం గతమ్,
అథవా పున రాయాతి జీర్ణం భ్రష్టాచ ఖండశః. 21

తా. పుస్తకము, ఆఁడుది, ధనము ఇవి ఒకరిచేతికి చిక్కినచో మఱీరావు. ఒకవేళ వచ్చినను పుస్తకము చినిఁగి వచ్చును. ఆఁడుది భ్రష్ట అయి వచ్చును. ధనము భాగములుగా వచ్చును.

శ్లో. ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మన్త్రౌషధసంగమా,
దానమానావమానాశ్చ నవగోప్యా మనీషిభిః. 22

తా. ఆయువు, ధనము, గృహచ్ఛిద్రము, మంత్రము, ఔషధము, సంగమము, దానము, మానము, అవమానము, ఈతొమ్మిదింటిని పండితులు దాఁచవలెను. (అనఁగా ఒకరితో చెప్పరాదు).

శ్లో. ఋణానుబన్ధరూపేణ పశుపత్నీసుతాలయాః,
ఋణక్షయే క్షయం యాన్తికాతత్ర పరివేదనా?. 23

తా. పశువులు, భార్యలు, కొడుకులు, ఇండ్లు, ఋణానుబంధమును బట్టి కలుగును. ఋణము తీఱఁగానే పోవును. ఆ విషయమై విచారమేల?

శ్లో. దూషకశ్చ క్రియాశూన్యో నికృష్టోదీర్ఘకోపనః,
చత్వారః కర్మచండాల జాతిచణ్డాల ఉత్తమః. 24

తా. ఒకరిని నిందించువాఁడు కర్మముల మానినవాఁడు లోభివాఁడు, దీర్ఘకోధము గలవాఁడు ఈ నలుగురును, కర్మచండాలురు. వీరికంటె జాతిచండాలుఁడు ఉత్తముఁడు.

శ్లో. రాజవత్ పంచ వర్షాణి దశ వర్షాణి దాసవత్,
ప్రాప్తేతు షోడశేవర్షేపుత్త్రంమిత్త్రవ దాచరేత్. 25

తా. కుమారుని అయిదేండ్లవఱకును రాజువలెను పదేండ్లు సేవకునివలెను పదియాఱవయేడు రాఁగానే మిత్రుని వలెను చూడవలయును.

శ్లో. ఏకైకాగాస్త్రయస్సింహాః పంచ వ్యాఘ్రాః ప్రసూతిభిః,
అధర్మో నష్టసంతానో ధర్మస్సంతానవర్ధనః 26

తా. గోవు ఒక్కొక్కటియే పుట్టును. సింహములు మూఁడేసిపుట్టును. పులులు అయిదేసిగాఁబుట్టును. కానియధర్మమేవాని సంతతిని నశింపఁజేయును. గోవుఒక్కొక్కటిగా పుట్టినను ధర్మసంతానమగుటచే వృద్ధిలోనికివచ్చును.

శ్లో. బాలార్కః ప్రేతధూమశ్చ వృద్ధా స్త్రీపల్వలోదకమ్,
రాత్రౌదధ్యన్నభుక్తిశ్చ ఆయుఃక్షీణం దినేదినే. 27

తా. ఉదదయకాలపుఎండ తాఁకుట, పీనుగుపొగ సోకుట, తనకన్న పెద్దదగుస్త్రీతోడిసంభోగము, కలుషమగు నీరుత్రాగుట, రాత్రిపూట పెరుఁగుతో అన్నము తినుట, ఇవి ఆయువును దినదినమును క్షీణింపఁచేయును.

శ్లో. వృద్ధార్కో హోమధూమశ్చ బాలా స్త్రీనిర్మలోదకం
రాత్రౌ క్షీరాన్నభుక్తిశ్చ ఆయుర్వృద్ధి ర్దినేదినే. 28

తా. సాయంకాలపు సూర్యునియెండ, హోమపుపొగ తనకన్న చిన్నదానితోడి సంగమము, తేటనీరు త్రాగుటఁ

రాత్రిపూటపాలు అన్నము తినుట ఇవి దినదినమును ఆయు
వును వృద్ధిచేయును.

శ్లో. ఉత్తమం స్వార్జితం విత్తం మధ్యమం పితురార్జితమ్,
అధమం భ్రాతృ విత్తంచ. స్త్రీవిత్త మధమాధమమ్. 29

తా. తానుగణించుకొన్న సొమ్ము ఉత్తమము. తండ్రి గణించినసొమ్ము మధ్యమము. సోదరులు గణించినసొమ్ము అధమము. స్త్రీలసొమ్ము అధమాధమము.

శ్లో. ఉత్తమా కులవిద్యాయా మధ్యమా కృషివాణిజాత్,
అధమా సేవయావృత్తి ర్మృత్యుశ్చౌర్యోప జీవనమ్. 30

తా. తనకులవిద్యవలనఁ జీవించుట ఉత్తమము. కృషివలన వర్తకమువలన జీవించుట మధ్యమము. దాస్యముచేసి జీవించుట అధమము. దొంగిలించి జీవించుట మృత్యువు. అనఁగా అట్లుచేయుటకన్న చావేమేలు.

శ్లో. ఉత్తమేక్షణకోపస్స్యా న్మధ్యమే ఘటికాద్వయమ్
అధమేస్యా దహోరాత్రం పాపిష్ఠే మరణాన్తకః. 31

తా. ఉత్తమునియందు క్షణకాలము, మధ్యమునియందుగడియలు, అధమునియందు ఒకరాత్రిపగలును, పాపినియందు చచ్చువఱకును కోపము ఉండును.

శ్లో. ఆత్మబుద్ధి స్సుఖంచైవ గురుబుద్ధి ర్విశేషతః
పరబుద్ధి ర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయంకరీ. 32

తా. తనకుఁదోచినబుద్ధి సుఖమును గలుగఁ జేయును. గురువుచెప్పినబుద్ధి మఱింతసుఖమును గలుగఁజేయును. పరులు ఉపదేశించినబుద్ధి వినాశమును గలుగఁజేయును. స్త్రీలబుద్ధి మహాప్రళయమునే చేయును.

శ్లో. అతిథౌ తిష్ఠతి ద్వారి హ్యాపో గృహ్ణాతి యోనరః
ఆపోశనం సురాపాన మన్నం గోమాంసభక్షణమ్. 33

తా. అతిథి వాకిటనుండఁగా వానినివిడిచి యెవ్వరైనను ఆపోశనమును బట్టువాని ఆపోశనము కల్లుతోసమము. అన్నము గోమాంసముతో సమము.

శ్లో. దర్శనా చ్చిత్తవైకల్యం స్పర్శనాత్తు ధనక్షయమ్, 34
సంభోగా త్కిల్బిషం పణ్య స్త్రీణాం ప్రత్యక్షరక్షసామ్.31

తా. ప్రత్యక్ష రాక్షసులగు వేశ్యలను జూచుట వలన మనస్సు వికలమగును. ముట్టుకొనుటవలన ధనము నాశన మగును. సంభోగమువలనఁ బాపము చుట్టుకొనును.

శ్లో. దాసీ మానధనం హన్తి హన్తి వేశ్యాధనాధికమ్,
ఆయూంషి విధవాహన్తి సర్వంహన్తి పరాఙ్గనా. 35

తా. దాసీసంగమమువలన మానభంగము కలుగును. వేశ్యాసంగమమువలనఁ జాలధనము పోవును. విధవాసంగమమువలన ఆయుపుపోవును. పరస్త్రీసంగమము వలన ఇవియన్నియు బోవును.

శ్లో. దుర్జనం కాంచనం భేరీం దుష్టస్త్రీం దుష్టవాహనమ్,
ఇక్షుఖణ్డాన్ తిలాన్ శూద్రాన్ మర్దయే ద్గుణవృద్ధయే. 36

తా. దుర్మార్గుని, బంగారును, భేరిని, చెడుస్త్రీని, చెడుగుఱ్ఱమును, చెఱకుముక్కలను, తిలలను, శూద్రులను మర్దించుటవలన గుణము వృద్ధిపొందును.

శ్లో. నగచ్ఛే ద్రాజయుగ్మంచ నగచ్ఛే ద్బ్రాహ్మణత్రయమ్,
చతుశ్శూద్రా న్నగచ్ఛేయు ర్నగచ్ఛే ద్వైశ్యపఞ్చకమ్. 37

తా. ఇద్దఱు రాజులు, ముగ్గురు బ్రాహ్మణులు, నలుగురు శూద్రులు, అయిదుగురు కోమట్లును కలసి యొకపనిమీఁదఁ బోరాదు.

శ్లో. ఉషశ్శశంస గార్గ్యస్తు శకునంతు బృహస్పతిః
మనోజవంతు మాణ్డవ్యో విప్రవాక్యం జనార్దనః. 38

తా. పోవుటకు గార్గ్యుఁడు ప్రాతఃకాలము మంచిదనియు, బృహస్పతి శకునము చూచి వెళ్ళవలయుననియు, మాండవ్య మహాముని మనస్సుయొక్క వేగమే మంచిదనియు, జనార్దనుఁడు బ్రాహ్మణుని వాక్యమే మంచిదనియు చెప్పిరి.

శ్లో. శర్వరీ దీపకశ్చన్ద్రః ప్రభాతో దీపకో రవిః,
త్రైలోక్యదీపకో ధర్మః సుపుత్త్రః కులదీపకః. 39

తా. చంద్రుఁడు రాత్రిని ప్రకాశింపఁజేయును. సూర్యుఁడు పగటిని బ్రకాశింపఁజేయును. ధర్మము ముల్లోకములఁ

ప్రకాశింపఁజేయును. మంచికుమారుఁడు కులమును ప్రకాశింపఁజేయును.

శ్లో. సబన్ధుర్యోహితేషుస్స్యా త్సపితాయస్తు పోషకః
ససఖా యత్రవిశ్వాస స్సాభార్యా యత్రనిర్వృతిః. 40

తా. హితమును గోరువాఁడే బంధువు. పోషించువాఁడేతండ్రి. నమ్మకమైనవాఁడే మిత్త్రుఁడు. సుఖమునుగలుగఁజేయునదియే పెండ్లము.

శ్లో. అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాంచ రక్షణే,
ఆయేదుఃఖం వ్యయే దుఃఖం కిమర్థం దుఃఖభాజనమ్. 41

తా. ధనము గణించునప్పుడు దుఃఖము. దానినిగాపాడునప్పుడు దుఃఖము. దానిమీఁద ఇంకను ఆదాయము రాలేదని దుఃఖము. వ్యయమగునప్పుడు దుఃఖము. కాబట్టి దుఃఖమును గలిగించు ధనమును నిందించ వలయును.

శ్లో. హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే. 42

తా. విష్ణువుగాని, శివుఁడుగాని, బ్రహ్మగాని, దేవతలుగాని, యెవరైనను నుదుటవ్రాసిన వ్రాతఁను దుడువలేరు.

శ్లో. ఘృతేన వర్ధతే బుద్ధిః క్షీరేణాయుష్యవర్ధనమ్,
శాకేనవర్ధతే వ్యాధి ర్మాంసం మాంసేన వర్ధతే. 43

తా. నేతిచే బుద్ధియు, పాలచే ఆయువు, కూరలచే రోగము, మాంసముచే మాంసమును వృద్ధినొందును.

శ్లో. ఉత్సాహ స్సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః,
షడేతే యత్రతిష్ఠంతి తత్రదేవ్యో౽పి తిష్ఠతి. 44

తా. ఉత్సాహము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము, ఆఱును ఎవనియందుండునో వానియందు దేవుఁడును గలఁడు.

శ్లో. అసంతుష్టో ద్విజో నష్ట స్సంతుష్ట ఇవపార్థివః
సలజ్జా గణికా నష్టా నిర్లజ్జేవ కులాఙ్గనా. 45

తా. సంతుష్టి లేని బ్రాహ్మణుఁడు, సంతుష్టిగల రాజు, సిగ్గుగల వేశ్య, సిగ్గు లేనికులస్త్రీ, వీరు చెడిపోవుదురు.

శ్లో. వేదమూలమిదం బ్రాహ్మ్యం భార్యామూలమిదంగృహమ్
కృషిమూల మిదం ధాన్యం ధనమూల మిదంజగత్. 46

తా. బ్రాహ్మణ్యమునకు వేదములు, ఇంటికిభార్య, ధాన్యమునకు కృషి, లోకమునకు ధనము ఇవ్వియే ఆధారములు.

శ్లో. సిలాస్థగన్ధలేపశ్చ మార్జారోచ్ఛిష్టభోజనమ్,
ప్రతిబిమ్బేక్షణం నీరే శక్రస్యాపి శ్రియం హరేత్. 47

తా. ఱాతిమీఁది గంధము పూసికొన్నను, పిల్లి యెంగిలిచేసినది తిన్నను, నీటిలో నీడ చూచుకొన్నను దేవేంద్రునకై నను ఐశ్వర్యము తొలఁగును.

శ్లో. అజారజః ఖరరజ స్తథా సమ్మార్జనీరజః
స్త్రీణాం పాదరజశ్చైవ శక్రస్యాపి శ్రియం హరేత్. 48

తా. మేఁకల కాలిధూళి, గాడిద కాలిధూళి, చీఁపురు కట్టధూళి, స్త్రీల కాలిధూళి ఇవి తగిలినచో దేవేంద్రునకైనను ఐశ్వర్యము తొలఁగును.

శ్లో. కృషితో నాస్తిదుర్భిక్షం జపతో నాస్తి పాతకమ్,
మౌనేన కలహో నాస్తి నాస్తి జాగరతో భయమ్. 49

తా. కృషివలన కఱవు, జపమువలనఁ బాపము, మౌనమువలన కలహము జాగ్రతవలన భయమును లేవు.

శ్లో. ఏకోఽపిగుణవాన్ పుత్రో నిర్గుణేన శతైరపి,
ఏకచన్ద్రప్రకాశేన నక్షత్రైః కింప్రయోజనమ్. 50

తా. గుణహీనులు నూఱుగురికంటె గుణవంతుఁ డొక్క కొడుకే చాలును. ఒక్క చంద్రుఁడు ప్రకాశించు చుండగా నెన్ని చుక్కలున్నను నేమి లాభమున్నది.

శ్లో. ప్రస్తావసదృశం వాక్యం స్వభావసదృశీంక్రియామ్,
ఆత్మశక్తిసమం కోపం యోజానాతి సపండితః. 51

తా. ప్రస్తావనకు తగినమాట, స్వభావమునకుతగినపని తనశక్తికి తగినకోపమును బాగుగా నెఱిఁగినవాఁడేపండితుడు.

శ్లో. వివాదశీలాం స్వయమర్థచోరిణీం
పరానుకూలాం పరిహాస భాషిణీమ్,
అగ్రాశినీ మన్యగృహప్రవేశినీం
త్యజన్తి భార్యాం దశపుత్రమాతరమ్. 52

తా. జగడమాడు స్వభావము గలదియు, తనయింటి సొమ్ము నపహరించునదియు, పరుల కనుకూలమైనదియు, పరిహాసముగా మాటలాడునదియు, మగనికంటె ముందుగా భుజించునదియు, ఇరుగుపొరుగుఇండ్లకుఁ బోవుచుండునదియు అగు భార్య పదిమంది పిల్లలతల్లి అయినను విడిచిపెట్టవలయును.

శ్లో. కార్యేషు దాసీ కరణేషుమన్త్రి
రూపేచలక్ష్మీః క్షమయా ధరిత్రీ,
స్నేహేచమాతా శయనేతు వేశ్యా
షట్కర్మయుక్తాః కులధర్మపత్నీ. 53

తా. ఇంటిపనులయందు దాసివలెను, ఆలోచన చెప్పుటకు మంత్రివలెను, రూపమునందు లక్ష్మివలెను, ఓర్పుచే భూమివలెను, ప్రేమయందుఁ దల్లివలెను, ప్రక్కపై నున్నపుడు వేశ్యవలెను ఈరీతిగా ఆఱుపనులు గలదే కులమును ఉద్ధరించు పత్ని అని చెప్పఁదగును.

శ్లో. నవిషం విషమిత్యాహు ర్బ్రహ్మస్వం విషముచ్యతే,
విషమేకాకినం హన్తి బ్రహ్మస్వంపుత్త్రపౌత్రకం. 54

తా. పాముమొదలగు జంతువుల విషము విషముకాదు బ్రాహ్మణధనమే విషము. ఏమనఁగా విషము ఒక్కనినే చంపును. బ్రాహ్మణుని విత్తము హరించినచో పుత్త్రులను పౌత్త్రులనుగూడ జంపును.

శ్లో. శతనిష్కో ధనాఢ్యశ్చ శతగ్రామేణ భూపతిః,
శతాశ్వః క్షత్త్రియోరాజా శతశ్లోకేనపణ్డితః. 55

తా. నూఱురూకలు గలవాఁడు ధనవంతుఁడు, నూఱు గ్రామములు గలవాఁడు భూపతి, నూఱు గుఱ్ఱములు గలవాఁడు రాజు, నూఱుశ్లోకములు వచ్చినవాఁడు పండితుఁడు.

శ్లో. శకటం పంచ హస్తేషు దశహస్తేషు వాజినమ్,
గజం హస్తసహస్రేషు దుష్టం దూరేణ వర్జయేత్. 56

తా. బండికి ఐదుమూరల దూరముగాను, గుఱ్ఱమునకు పదిమూరల దూరముగాను ఏనుఁగునకు వేయిమూరల దూరముగాను, దుర్మార్గునకు చాలదూరముగాను తొలఁగవలయును.

శ్లో. అనభ్యాసే విషంశాస్త్ర మజీర్ణే భోజనంవిషమ్,
దరిద్రస్య విషంగోష్ఠీ వృద్ధస్య తరుణీవిషమ్. 57

తా. అభ్యాసము లేనప్పుడు శాస్త్రము, జీర్ణము కానప్పుడు భోజనము, దరిద్రునకు గోష్ఠియు, ముసలివానికి పడుచు పెండ్లమును విషము.

శ్లో. జిహ్వాగ్రేవర్తతే లక్ష్మీ ర్జిహ్వాగ్రే మిత్రబాన్ధవాః
జిహ్వాగ్రే బన్ధనప్రాప్తి ర్జిహ్వాగ్రే మరణం ధ్రువమ్. 58

తా. లక్ష్మి నాలుకకొననే యుండును. మిత్రులు బంధువులు నాలుకకొననే యుందురు. బంధనప్రాప్తియు నాలుకకొననే యుండును. తుదకు మరణమును నాలుకకొననే యుండును. అనఁగా మంచిమాట లాడినచో మంచికలుగును. చెడ్డమాటలాడినచో చెడ్డయుఁ గలుగుననుట.

శ్లో. అదానదోషేణ భవే ద్దరిద్రో
దారిద్ర్యదోషేణ కరోతిపాపమ్,
పాపా దవశ్యం నరకం ప్రయాతి
పునర్దరిద్రీ పునరేవపాపీ. 59

తా. దానమీయ కుండుటచే దరిద్రుడై పుట్టును. దారిద్ర్యదోషముచేఁ బాపపు పనులుచేయును. పాపమువలన నరకమును బొందును. మరల దరిద్రుఁడైపుట్టి మరల పాపాత్ముఁడగును.

శ్లో. అతిథి ర్బాలక శ్చైవ స్త్రీజనోనృపతి స్తథా,
ఏతే విత్తం నజానన్తి జామాతా చైవ పఞ్చమః. 60

తా. అతిథి, పిల్లవాడు, ఆఁడుది, రాజు, అల్లుఁడు ఈ యైదుగురును మనుజుని కలిమిలేములను గుర్తెఱుఁగరు.

శ్లో. కుదేశంచ కుమిత్రంచ కురాజ్యంచ కుబాన్ధవాన్,
కుభార్యాంచ కురాష్ట్రంచ దూరతః పరివర్జయేత్. 61

తా. చెడ్డదేశమును, చెడుస్నేహితుని, చెడ్డరాజ్యమును, చెడుగులగు బంధువులను, చెడుభార్యను, చెడురాష్ట్రమును దూరముగా విడువవలయును.

శ్లో. స్త్రీణాం ద్విగుణ ఆహారో బుద్ధిశ్చాపి చతుర్గుణా,
సాహసం షడ్గుణంచైవ కామోఽష్టగుణఉచ్యతే. 62

తా. స్త్రీలకు మగవారికంటె ఆహారమురెండురెట్లు, బుద్ధి నాలుగురెట్లు, సాహసము ఆఱురెట్లు, కామముఎనిమిదిరెట్లును ఉండును.

శ్లో. రాజారాష్ట్రకృతం పాపం రాజపాపం పురోహితః,
భర్తా చ స్త్రీకృతం పాపం శిష్యపాపం గురుర్వ్రజేత్. 63

తా. తన రాష్ట్రములోని జనులు చేసిన పాపమును రాజు పొందును. రాజుచేసిన పాపమును పురోహితుఁడు పొందును. భార్య చేసినపాపము మగఁడుపొందును. శిష్యుని పాపమును గురువు పొందును.

శ్లో. గీతే వాద్యే తథానృత్తే సంగ్రామే రిపుసంకటే,
ఆహారే వ్యవహారేచ త్యక్తలజ్జః సుఖీ భవేత్. 64

తా. పాడునపుడు, వాయించునపుడు, ఆడునపుడు, యుద్ధము చేయునపుడు, శత్రులవల్ల చిక్కుకలిగినపుడు, భోజనము చేయునపుడు, వ్యవహారము చేయునపుడు, సిగ్గు విడిచిన వాఁడు సుఖము నొందును.

శ్లో. రూపయౌవనసంపన్నా విశుద్ధకులసంభవాః,
విద్యాహీనా న శోభన్తే నిర్గన్ధా ఇవ కింశుకాః. 65

తా. రూపము యౌవనము గలవారైనను మంచివంశములోఁ బుట్టినవారైనను విద్యలేనివారు వాసనలేని మోదుగు పూలవలెనే శోభింపరు.

శ్లో. త్యజే దేకం కుల స్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే చాత్మార్థే పృథివీం త్యజేత్. 66

తా. ఒక్కనివలన కులము చెడునపుడు, వానిని విడువవలెను. ఒకకులమువలన గ్రామము చెడవలసివచ్చినపుడు, ఆ కులమును విడువవలెను. ఒక గ్రామమువలన రాష్ట్రమునకు హాని కలుగునపుడు ఆగ్రామము విడువవలెను. తనకు హాని కలుగునపుడు తనకున్న భూమిని విడువవలయును.

శ్లో. కోకిలానాం స్వరోరూపం పాతివ్రత్యంతు యోషితామ్,
విద్యా రూపం విరూపాణాం క్షమా రూపం తపస్వినామ్.

తా. కోకిలకు స్వరమేరూపము. స్త్రీలకు పాతివ్రత్యమే రూపము. రూపహీనులకు విద్యయే రూపము. తపస్సుచేసి కొనువారికి ఓరిమియే రూపము.

శ్లో. దైవాధీనం జగత్సర్వం మన్త్రాధీనం తు దైవతమ్,
తన్మన్త్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదైవతమ్.68

తా. ఈజగత్తు అంతయు దైవాధీనము. ఆదైవము మంత్రాధీనము. ఆమంత్రము బ్రాహ్మణుల ఆధీనమై యున్నది. కాబట్టి బ్రాహ్మణులే నాకు దైవములని భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్లో. పిబన్తినద్యస్స్వయమేవనామ్భః
ఖాదన్తినస్వాదుఫలానివృక్షాః,

పయోధరాస్సస్యమదన్తినైవ
పరోపకారాయసతాంవిభూతయః. 69

తా. నదులుతమయందలి జలమునుఁ దాము త్రాగవు. వృక్షములు తమతీయని పండ్లను తాముతినవు. మేఘములు పయిరులను తాముతినవు. సత్పురుషుల ఐశ్వర్యములు పరోపకారముకొరకుఁ గదా.

శ్లో. పక్షీణాం బలమాకాశం మత్స్యానాముదకం బలమ్.
దుర్బలస్య బలం రాజా బాలానాం రోదనం బలమ్. 70

పక్షులకుఆకాశమేబలము. చేఁపలకు ఉదకమేబలము. బలములేనివారికి రాజేబలము. బాలురకు ఏడుపేబలము.

శ్లో. వృశ్చికస్య విషం పుచ్ఛం మక్షికస్య విషం శిరః,
తక్షకస్య విషం దంష్ట్రా సర్వాఙ్గం దుర్జనేవిషమ్. 71

తా. తేలునకు తోఁక యందును, ఈఁగకు తలయందును, పామునకు కోఱలయందును, దుర్జనునకు అన్ని అవయవములయందును, విషముండును.

శ్లో. పుస్తకేషు చయావిద్యా పరహస్తేచ యద్ధనమ్,
సమయేతు పరిప్రాప్తే నసావిద్యానతద్ధనమ్. 72

తా. పుస్తకములలోని విద్యయును, ఒకరిదగ్గర దాచిపెట్టుకొన్న ధనము సమయము వచ్చినప్పుడు పనికిరావు. కాఁబట్టి చదువు కంఠమునందుంచవలెను. ధనము దగ్గర ఉంచుకొనవలెను.

శ్లో. నశ్యత్యనాయకం కార్యం తథైవ శిశునాయకమ్.
స్త్రీనాయకం తథోన్మత్త నాయకం బహునాయకమ్. 73

తా. యజమానుడులేని కార్యము, పిల్లకాయలపెత్తనము గలకార్యము, స్త్రీలయాజమాన్యము క్రిందనున్న కార్యము, పిచ్చిపట్టినవారి ప్రభుత్వమునందున్న కార్యము, పెక్కురు నాయకులుఁగాఁగల కార్యము ఈకార్యములు చెడకతీరవు.

శ్లో. అభ్యాసానుసరీవిద్యా బుద్ధిః కర్మానుసారిణీ,
ఉద్యోగాను సరీ లక్ష్మీః ఫలం భాగ్యానుసారిణీ. 74

తా. విద్య అభ్యాసము ననుసరించియే యుండును. బుద్ధి కర్మముననుసరించియే యుండును. లక్ష్మి వ్యాపారము ననుసరించియే యుండును. ఫలము అదృష్టము ననుసరించియే యుండును.

శ్లో. వసంతయౌవనా వృక్షాః పురుషాధనయౌవనాః,
సౌభాగ్యయౌవనా నార్యో యువానో విద్యయా బుధాః

తా. వృక్షములకు వసంతకాలమే యౌవనము. పురుషులకు ధనమే యౌవనము. స్త్రీలకు సౌభాగ్యమే యౌవనము. పండితులకు చదువే యౌవనము.

శ్లో. వృథావృష్టి స్సముద్రేచ వృథాతృప్తేతు భోజనం
వృథాధనపతౌ దానం దరిద్రే యౌవనం వృథా. 76

తా. సముద్రములో కురిసినవాన, కడుపునిండినవానికి భోజనము, ధనవంతునకు ఇచ్చిన దానము, దరిద్రునికిఁ గల యౌవనము ఇవి వ్యర్థము.

శ్లో. అర్థా గృహే నివర్తంతే శ్మశానే మిత్త్రబాన్ధవాః,
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్త మనుగచ్ఛతి. 77

తా. చచ్చినవెనుక ధనము ఇంటనే ఉండిపోవును. మిత్త్రులు బంధువులు శ్మశానము నొద్దను ఉండిపోవుదురు. తాను చేసికొన్న పుణ్యాపాపములు తనతో వెంటఁబడి వచ్చును. కాఁబట్టి పుణ్యకార్యములే చేయవలెను.

శ్లో. తస్కరస్య వధో దణ్డో దాసీదణ్డస్తు ముణ్డనమ్,
భార్యాదణ్డః పృథక్ శయ్యా మిత్రదణ్డ మభాషణమ్. 78

తా. దొంగకు హింసయే దండనము. దాసునకు తల గొరిగించుటయే దండనము. భార్యకు వేఱుగాఁ బరుండుటయే దండనము. మిత్త్రునికి మాటలాడకుండుటయే దండనము.

శ్లో. పితాచ ఋణవాన్ శత్రు ర్మాతాచ వ్యభిచారిణీ,
భార్యాఽరూపవతీ శత్రుః పుత్త్రః శత్రు రపణ్డితః. 79

తా. అప్పులపాలుచేసిన తండ్రియు, వ్యభిచరించుతల్లియు, కురూపిణియగు భార్యయు, మూర్ఖుఁడగు కొడుకును శత్రువులు.

శ్లో. పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షన్తి వార్ధకే పుత్త్రా నస్త్రీస్వాతంత్ర్య మర్హసి. 80

తా. స్త్రీలను బాల్యమందుఁ దండ్రియు, యౌవనమందు మగఁడును, ముదిమి వచ్చినపిమ్మట కుమారులును రక్షించుచుందురు. కావున స్త్రీలకెప్పుడును స్వాతంత్రత లేదు.

శ్లో. అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీం వృద్ధబాలకౌ,
రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుమ్. 81

తా. అగ్నిహోత్రము, తనగృహము, పుణ్యక్షేత్రము, గర్భిణి, ముసలివారు, బాలకులు, రాజు, దైవము, గురువు వీరిదగ్గరకుఁ బోవునపుడు వట్టిచేతులతోఁ బోరాదు.

శ్లో. అహో ప్రకృతిసాదృశ్యం శ్లేష్మణో దుర్జనస్యచ.
మధురైః కోప మాయాతి కటుకై రుపశామ్యతి. 82

తా. దుర్జనుఁడు, శ్లేష్మము స్వభావముచేత సమానములు. ఏమనఁగా శ్లేష్మము మధురవస్తువులచే వృద్ధిపొంది చేదువస్తువులచే శాంతినిబొందునట్లే దుర్జనుఁడును మంచిమాటలచే కోపమును, కఠినపుమాటలచే శాంతమును బొందును.

శ్లో. జనితా చోపనేతాచ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
అన్నదాతా భయత్రాతా పఞ్చైతే పితరః స్మృతాః 83

తా. కన్నవాఁడు, ఉపనయనము చేసినవాఁడు, విద్య నేర్పినవాఁడు, అన్నము పెట్టినవాఁడు, భయమునుండి రక్షించినవాఁడు ఈయైదుగురును దండ్రులు.

శ్లో. దరిద్రాయ కృతం దానం శూన్యలిఙ్గస్య పూజనమ్,
అనాథప్రేత సంస్కార మశ్వమేధసమం విదుః. 84

తా. దరిద్రునకు దానమిచ్చుట, శూన్యలింగమునకుఁ బూజసేయుట, దిక్కులేని శవమును గాల్చుట, యివి అశ్వమేధయాగముతో సమానములని పండితులందురు.

శ్లో. దాతృత్వం ప్రియవ క్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా,
అభ్యాసేన నలభ్య న్తే చత్వారః సహజాగుణాః. 85

తా. దానమిచ్చుట, మంచిమాట లాడుట, ధైర్యము, సమయ మెఱుఁగుట అను నీ నాలుగును బుట్టుకతోఁ గలిగెడు గుణములు.

శ్లో. ఆభుక్త్వాఽమలకం పథ్యం భుక్త్వా తు బదరీఫలమ్,
కపిత్థం సర్వదా పథ్యం కదళీ న కదాచన. 86

తా. భోజనము సేయకమునుపు ఉసిరి కాయయు, భుజించినపిదప రేఁగుపండును, ఎల్లప్పుడును వెలఁగపండును పథ్యమైనవికాని అరఁటిపండ్లు ఎప్పుడును పథ్యముకాదు.

శ్లో. శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదు క్తం గ్రన్థకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్. 87

తా. కోట్లకొలఁదిగానుండు గ్రంథములలోఁ జెప్పినదానిని అర్ధశ్లోకముతోఁ జెప్పుచున్నాను. ఏది అనఁగా ఒకరికి ఉపకారము చేసినచో పుణ్యము, అపకారము చేసినచో పాపము సంభవించును.

శ్లో. దుష్టభార్యా శఠో మిత్రం భృత్యోఽహంకారసంయుతః
ససర్పే చ గృహే వాసో మృత్యురేవ నసంశయః. 88

తా. దుర్మార్గురాలగు పెండ్లాము, నమ్మించిగొంతు కోయు స్నేహితుఁడు, గర్వముతోఁగూడిన సేవకుఁడు పాముల

త్తో నిండిన యింటిలో వసించుట యివి తప్పక మృత్యువును గలిగించును.

శ్లో. యస్మిన్ దేశో న సన్మానో న ప్రీతి ర్న చ బాన్ధవాః,
నవిద్యా నాస్తి ధనికో నతత్ర దివసం వసేత్. 89

తా. గౌరవము, ప్రేమ, బంధువులు, విద్య, ధనవంతులు లేనిచోటున ఒకరోజైనను ఉండఁగూడదు.

శ్లో॥ అగ్నిహోత్రఫలా వేదా దత్తభుక్తఫలం ధనమ్,
రతిపుత్త్రఫలా దారా శ్శీలవృత్తఫలం శ్రుతమ్. 90

తా. వేదములు చదువుకొన్నందుకు అగ్నిహోత్రములు చేయుటయు, ధనమున్నందులకు దానమిచ్చుట, భోగములనుభవించుట, పెండ్లాము ఉన్నందుకు ఆనందమనుభవించుట, పుత్త్రులఁగనుట, చదువుకొన్నందుకు మంచిస్వభావమును మంచినడతను సంపాదించుకొనుటయు ఫలమని చెప్పుదురు. అనఁగా అవి లేనిచో నివి వ్యర్థము.

శ్లో॥ స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః,
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే. 91

తా. మూర్ఖుఁడు తనయింటను, ప్రభువు తన గ్రామములోను, రాజు తన దేశమందును బూజింపఁ బడుచుందురు. పండితుఁ డన్నిచోటులను బూజింపబడుచుండును.

శ్లో. కుచేలినం దన్తమలాపహారిణం
బహ్వాశినం నిష్ఠురవాక్యభాషిణమ్

సూర్యోదయే చాస్తమయేచ శాయినం
విముఞ్చతి శ్రీరపి చక్రపాణినమ్. 92

తా. మాసినబట్ట కట్టువాఁడు, దంతధావన చేయని వాఁడు, తిండిపోతు, కఠినపుమాట లాడువాఁడు, సూర్యోదయాస్తమయ కాలములయందు నిదురించువాఁడు, తుదకు విష్ణుమూర్తి అయినను సరియే వానిని లక్ష్మి విడిచిపెట్టును.

శ్లో. దీర్ఘశృఙ్గ మనడ్వాహం నిర్లజ్జాం విధవస్త్రియమ్,
శూద్రమక్షురసంయుక్తం దూరతః పరివర్జయేత్. 93

తా. పొడుగుకొమ్ములుగల యెద్దును, సిగ్గులేని విధవను, కత్తిపుచ్చుకొన్న శూద్రునిని దూరముగా విడువవలెను.

శ్లో. ముఖం పద్మదళాకారం వచశ్చన్దనశీతలమ్,
హృత్కర్తరీసమం భాతి వినయం ధూర్తలక్షణమ్. 94

తా. తామరఱేకువంటి మొగము, మంచిగందమువలెఁ జల్లనగుమాటలు, కత్తెరంతో సమానమగు మనస్సు, అతివినయము, ఇవి ధూర్తునికి లక్షణములు.

శ్లో. మాతృహీనశిశుజీవనంవృథా
కాన్తహీనవనితాయౌవనంవృథా,
శాన్తిహీనతపసః ఫలం వృథా
తిన్త్రిణీరసవిహీనభోజనమ్. 95

తా. తల్లిలేనిపిల్లల బ్రతుకు, పెనిమిటిలేని స్త్రీల

యౌవనము, శాంతిలేని తపస్సుయొక్క ఫలము, పులుసులేని భోజనము ఇవి వ్యర్థములని తెలియవలయును.

శ్లో. వస్త్రముఖ్య స్త్వలఙ్కారః ప్రియముఖ్యంతు భోజనమ్,
గుణో ముఖ్యస్తునారీణాం విద్యా ముఖ్యస్తు బ్రాహ్మణః.96

తా. అలంకారమునకు వస్త్రమును, భోజనమునకుఁ బ్రీతియు, స్త్రీలకు గుణమును, బ్రాహ్మణులకు విద్యయు ముఖ్యము.

శ్లో. అమృతం సద్గుణా భార్యా అమృతం బాలభాషితమ్,
అమృతం రాజసన్మాన మమృతం మానభోజనమ్. 97

తా. మంచిగుణములుగల భార్య, బాలకులపలుకులు రాజులగౌరవము, మితమగు భోజనము, ఇవి అమృతముతో సమానములు.

శ్లో. దుర్వృత్తో వా సువృత్తో వా మూర్ఖః పణ్డితఏవ వా,
కాషాయదణ్డమాత్రేణ యతిః పూజ్యో నసంశయః. 98

తా. దురాచారము గలవాఁడైనను, మంచి ఆచారముగలవాఁడైనను, మూర్ఖుఁడైనను, పండితుఁడైనను (ఎట్లాయినను సరియే) కాషాయవస్త్రములు దండము ధరించినమాత్రమున తప్పక సన్యాసిఅని పూజింపవలయును.

శ్లో. ఉపకారేణ నీచానా మపకారో హిజాయతే,
పయఃపానంభుజఙ్గానాం కేవలం విషవర్ధనమ్. 99

తా. నీచుల కుపకారముచేసినను అదిఅపకారమే యగును. పాలు పాములుతాగినను అది మఱింత విషమును వృద్ధియేచేయును.

శ్లో. ఋణం యాచ్నా చ వృద్ధత్వం జారచోరదరిద్రతా,
రోగశ్చభుక్తశేషశ్చాఽప్యష్టకష్టాః ప్రకీర్తితాః. 100

తా. అప్పులపాలగుట, యాచించుట, ముసలితనము, జారుఁడగుట, దొంగయగుట, దరిద్రుఁడగుట, రోగము, ఉచ్ఛిష్టభోజనము ఇవి అష్టకష్టములు.

శ్లో. దాసీ భృత్య స్సుతో బన్ధు ర్వస్తు వాహన మేవచ,
ధనధాన్యసమృద్ధిశ్చా ప్యష్టభోగాః ప్రకీర్తితాః. 101

తా. దాసీజనము, సేవకుఁడు, కొడుకు, బంధువు, వస్తువులు, వాహనము, ధనసమృద్ధి ధాన్యసమృద్ధి ఇవికలుగుటయేఅష్టభోగములు.

శ్లో. మక్షికా మారుతో వేశ్యా యాచకో మూషక స్తథా,
గ్రామణీ ర్గణకశ్చైవ సప్తైతే పరబాధకాః. 102

తా. ఈఁగ, గాలి, (దయ్యము) వేశ్య, యాచకుఁడు, ఎలుక, గ్రామాధికారి, ఈయేడుగురును ఒకరిని బాధించువారగుచున్నారు.

శ్లో. భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేనచ,
సేతుస్నానశతై ర్యచ్ఛ తత్ఫలం మాతృవన్దనే. 103

తా. ఆఱు పర్యాయములు భూమికిఁ బ్రదక్షిణము చేసినను, కాశీయాత్రచేసినను, నూరావృత్తులు సేతుస్నానముచేసినను ఎంతపుణ్యముకలుగునో అంతపుణ్యము తల్లికి వందనముచేసినఁ గలుగును.

శ్లో. నాన్నోదకసమం దానం నద్వాదశ్యాః పరంవ్రతమ్,
నగాయత్ర్యాః పరం మన్త్రం న మాతుః పరదైవతమ్.

తా. అన్నదానము, జలదానము వీనితోఁ సరియగు దానము, ద్వాదశీ వ్రతముకంటె నెక్కుడగువ్రతము, గాయత్రికంటె నెక్కువగు మంత్రము, తల్లికన్న హెచ్చుదైవమును లేదు. కాఁబట్టి ఇవి తప్పక గమనింపఁదగును.

శ్లో. రాజవత్పుత్రదారాశ్చ స్వామివన్మిత్రబాన్ధవాః,
ఆచార్యవత్సభామధ్యే భాగ్యవన్తం స్తువన్తిహి. 105

తా. ఆలుబిడ్డలచేత రాజవలెను, హితబంధువులచేత దేవునివలెను, సభికులమధ్య గురునివలెను, ధనవంతుఁడే చూడబడుచున్నాఁడు.

శ్లో. కపిలాక్షీరపానేన బ్రాహ్మణీసఙ్గమేనచ,
వేదాక్షరవిచారేణ శూద్రశ్చణ్డాలతాం వ్రజేత్, 106

తా. కపిలగోవుపాలు త్రాగినను, బ్రాహ్మణస్త్రీతోఁ సంగమము చేసినను, వేదాక్షరముల విమర్శించినను, శూద్రుఁడు చండాలతుల్యుఁడగును.

శ్లో. లోకయాత్రా భయంలజ్జా దాక్షిణ్యం ధర్మశీలతా,
పఞ్చయస్మిన్నవిద్యన్తే నకుర్యాత్తేన సఙ్గతిమ్. 107

తా. లోకవ్యవహారము, భయము, సిగ్గు, దాక్షిణ్యము ధర్మస్వభావము ఈయైదును లేనివారితో సహవాసము జేయగూడదు.

శ్లో. బాలసఖిత్వ మకారణహాస్యం,
స్త్రీషు వివాద మసజ్జనసేవా,
గార్ధభయాన మసంస్కృతవాణీ
షట్సునరోలఘుతాముపయాతి. 108

తా. బాలకులతో స్నేహించుట, కారణములేకుండ గనే నవ్వుట, స్త్రీలయందు వివాదపడుచుండుట, దుర్మార్గులను సేవించుట, గాడిదనెక్కి తిరుగుట, సంస్కృతభాష తెలిసికొ కుండుట, అనునీయాఱింటిచే పురుషుఁడు లాఘవము నొందును.

శ్లో. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్,
నహివన్ధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్. 109

తా. పండితునికష్టము పండితులకే తెలియవలెను. గాని మూర్ఖులకుఁ దెలియదు. గొప్పదియగు ప్రసవవేదనము గొడ్డురాలు తెలిసికొన జాలదుగదా!

శ్లో. విద్యాశ్చతస్రోఽసాధ్యా స్స్యుఃర్జన్మనా సహసంభవాః,
గాన్ధర్వంచ కవిత్వంచ శూరతా దానశీలతా. 110

తా. సంగీతము, కవిత్వము, శూరత్వము, దాతృత్వ ము, అను ఈనాలుగు విద్యలును పుట్టుకతోడనే కలుగవలె గాని నేర్చుకొందమన్న వచ్చునవి కావు.

శ్లో. మాతానిన్దతి నాభినన్దతి పితా భ్రాతానసంభాషతే
భృత్యః కుప్యతి నానుగచ్ఛతి సుతః కాన్తాఽపి నాలిఙ్గతే
అర్థప్రార్థన శఙ్కయాన కురుతే సల్లాపమాత్రం సుహృ
త్తస్మాదర్థ ముపార్జయ శ్రుణు సఖే హ్యర్థేన సర్వేవశాః

తా. ఓమిత్రమా! తల్లినిందించును. తండ్రిసంతోషింపఁడు. అన్నదమ్ములు మాటలాడరు. సేవకుఁడు కోపించును. కొడుకు వెంటరాఁడు. భార్యయుఁ గౌఁగిలింపదు. ధనముఁగునను అనుమానముచే తనస్నేహితుఁడు మాటలైననాడఁడు. కాఁబట్టి ధనము సంపాదింపుము. ఏమంటివా ? ధనముచేత అందఱును స్వాధీనులగుదురు.

శ్లో. గోమూత్రమాత్రేణ పయోవినష్టం
తక్రస్య గోమూత్రశతేనకింవా,
అత్యల్పపాపైర్విపదః శుచినాం
పాపాత్మనాంపాపశతేన కింవా. 112

తా. గోమూత్ర మేపాటికలిసినను పాలుచెడిపోవును. ఎంత గోమూత్రము కలిసినను మజ్జిగకేమినష్టము? అట్లె పరిశుద్ధులగు వారికి కొంచెము పాపము చేతనే ఆపదలు కలుగుచుండును. పాపాత్ములకు నూరు పాపము లుండినను ఏమినష్టము ?

శ్లో. సముద్రమన్థనే లేభే హరిర్లక్ష్మీంహరోవిషమ్,
భాగ్యం ఫలతి సర్వత్ర•నవిద్యా నచపౌరుషమ్. 113

తా. లోకవ్యవహారము, భయము, సిగ్గు, దాక్షిణ్యము ధర్మస్వభావము ఈమైదును లేనివారితో సహవాసము జేయగూడదు.

శ్లో. బాలసఖిత్వ మకారణహాస్యం
స్త్రీషు వివాద మసజ్జనసేవా,
గార్ధభయాన మసంస్కృతవాణీ
షట్సునరోలఘుతాముపయాతి. 108

తా. బాలకులతో స్నేహించుట, కారణము లేకుండగనే నవ్వుట, స్త్రీలయందు వివాదపడుచుండుట, దుర్మార్గులను సేవించుట, గాడిద నెక్కి తిరుగుట, సంస్కృతభాష తెలిసికోకుండుట, అనుసీయాఱింటిచే పురుషుఁడు లాఘవము నొందును.

శ్లో. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్,
నహివన్ధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్. 109

తా. పండితునికష్టము పండితులకే తెలియవలెను. గాని మూర్ఖులకుఁ దెలియదు. గొప్పదియగు ప్రసవవేదనము గొడ్డురాలు తెలిసికొనజాలదుగదా!

శ్లో. విద్యాశ్చతస్రోఽసాధ్యాస్స్యుఃర్జన్మనా సహసంభవాః,
గాన్ధర్వంచ కవిత్వంచ శూరతా దానశీలతా. 110

తా. సంగీతము, కవిత్వము, శూరత్వము, దాతృత్వము, అను ఈనాలుగు విద్యలును పుట్టుకతోడనే కలుగవలెగాని నేర్చుకొందమన్న వచ్చునవికావు.

శ్లో. మాతానిన్దతి నాభినన్దతి పితా భ్రాతానసంభాషతే
భృత్యః కుప్యతి నానుగచ్ఛతి సుతః కాన్తాఽపి నాలిఙ్గతే
అర్థప్రార్థన శఙ్కయాన కురుతే సల్లాపమాత్రం సుహృ
త్తస్మాదర్థ ముపార్జయ శ్రుణు సఖే హ్యర్థేన సర్వేవశాః

తా. ఓమిత్రమా! తల్లినిందించును. తండ్రిసంతోషింపఁడు. అన్నదమ్ములు మాటలాడరు. సేవకుఁడు కోపించును. కొడుకు వెంటరాఁడు. భార్యయుఁ గౌఁగిలింపదు. ధనముఁగుదును అనుమానముచే తనస్నేహితుఁడు మాటలైననాడఁడు. కాఁబట్టి ధనము సంపాదింపుము. ఏమంటివా? ధనముచేత అందఱును స్వాధీనులగుదురు.

శ్లో. గోమూత్రమాత్రేణ పయోవినష్టం
తక్రస్య గోమూత్రశ తేనకింవా,
అత్యల్పపాపైర్విపదః శుచీనాం
పాపాత్మనాంపాపశ తేన కింవా. 112

తా. గోమూత్ర మేపాటికలిసినను పాలుచెడిపోవును. ఎంత గోమూత్రము కలిసినను మజ్జిగకేమినష్టము? అట్లే పరిశుద్ధులగు వారికి కొంచెము పాపము చేతనే ఆపదలు కలుగుచుండును. పాపాత్ములకు నూరు పాపము లుండినను ఏమినష్టము?

శ్లో. సముద్రమన్థనే లేభే హరిర్లక్ష్మీంహరోవిషమ్,
భాగ్యం ఫలతి సర్వత్ర•నవిద్యా నచపౌరుషమ్. 113

తా. సముద్రమును మథించినప్పుడు విష్ణునకులక్ష్మి దొరకినది. శివునకు విషము దొరకినది. కాఁబట్టి అంతట ను అదృష్టమే ఫలించును గాని విద్య, పౌరుషము ఫలింపవు.

శ్లో. ఆతురే నియమో నాస్తి బాలే వృద్ధేతథైవచ,
సదాచారరతేచైవ హ్యేష ధర్మః సనాతనః. 114

తా. రోగగ్రస్తునకు, బాలునకు, ముసలివానికి, సదా చారరతుండగువానికిని నియమములక్కర లేదు. ఇట్టిధర్మము పూర్వకాలము నుండియు వచ్చుచున్నది.

ఏకోదేవః కేశవోవాశివోవా ఏకో వాసః పట్టణంవావనంవా,
ఏకంమిత్రం భూపతిర్వాయతిర్వా ఏకానారీసున్దరీవాదరీవా.

తా. విష్ణువైనను శివుఁడైనను సరియే. ఒక్కఁడే దైవమని నమ్మవలయును. పట్టణములోఁ గాని అడవిలోఁగాని వాసము చేయవలయును. రాజుతోడనైనను సన్యాసితోడనైనను మైత్రిచేయఁదగును. సుందరి అగు భార్యతోడనైన కూడియుండవలయును. లేదా కొండగుహాలో నుండి తపమైనఁ జేసికొనవలయును.

శ్లో. అజాయుద్ధేఋషిశ్రాద్ధే ప్రభాతే మేఘడమ్బరే,
దమ్పత్యోః కలహే చైవ బహ్వారమ్భో లఘుక్రియా.116

తా. మేఁకపోతుల పోట్లాటయందును, ఋషులు జరిగించు శ్రాద్ధములయందును, ప్రాతఃకాలపుమేఘముల ఆడం

బరమందును, దంపతుల కలహామందును ఆరంభ మధికమును క్రియ స్వల్పమును కనుపడును.

శ్లో. హతమశ్రోత్రియే దానం హతం సైన్య మనాయకమ్,
హతా రూపవతీ వన్ధ్యా హతో యజ్ఞ స్త్వదక్షిణః 117

తా. వేదము చదువనివాని కిచ్చినదానము, నాయకుండు లేని సైన్యము, గొడ్డురాలగు సురూపిణి, దక్షిణలేని యజ్ఞము ఇవి యెందులకు బనికిరావు.

శ్లో. క్రోధో వై వస్వతో రాజా ఆశా వైతరణీ నదీ,
విద్యా కామదుఘా ధేను స్సంతుష్టో నన్దనం వనమ్. 118

తా. కోపము యమధర్మరాజువలె బాధించును. ఆశ వైతరణీనదివలె దాంట వీలులేనిది. విద్య కామధేనువువలె కోరికల నిచ్చును. సంతోషము నందన వనము చందమున సుఖమును గలుగం జేయును.

శ్లో. అసారే ఖలు సంసారే సారం శ్వశురమన్దిరమ్,
హిమాలయే హరః శేతే హరిః శేతే మహోదధౌ. 119

తా. సారములేని యీసంసారమునందు అత్తవారి యిల్లొక్కటియేసారమైనది. కావుననే ఈశ్వరుండు హిమవత్పర్వతముమీందను, విష్ణుమూర్తి సముద్రములోను నిద్రపోవు చున్నారు.

శ్లో. అస్థిరం జీవనం లోకే అస్థిరం యౌవనం ధనమ్,
అస్థిరం దారపుత్త్రాది ధర్మః కీర్తిర్ద్వయం స్థిరమ్. 120

తా. జీవనము, యౌవనము, ధనము, దారపుత్త్రాదులు ఇవియన్నియుస్థిరములుగావు గాని, ఒక్కధర్మము, కీర్తి యీ రెండే శాశ్వతముగాఁడుండిపోవును.

శ్లో. చిన్తా జ్వరో మనుష్యాణాం వస్త్రాణా మాతపో జ్వరః,
అసౌభాగ్యంజ్వరః స్త్రీణా మశ్వానాం మైథునంజ్వరః121

తా. మనుష్యులకు చింత, వస్త్రములకు ఎండ, స్త్రీలకుసౌభాగ్యము లేకపోవుట; గుఱ్ఱములకు మైథునము జ్వరమని తెలిసికోవలయును.

శ్లో. చితా చిన్తాద్వయోర్మధ్యే చిన్తా నామ గరీయసీ,
చితా దహాతి నిర్జీవం చిన్తా ప్రాణయుతం వపుః. 122

తా. చిత అనఁగా శవములను గాల్చుటకు పేర్చిన పాడి చింత అనఁగా విచారము. అట్టిచితచింత యీరెంటిలో చింతయే గొప్పది. ఏమందురో చితచచ్చినదేహమును గాల్చును. చింత బ్రతికియున్న దేహమునేగాల్చును.

శ్లో. అజగామ యదా లక్ష్మీ ర్నారికేళఫలామ్బువత్,
నిర్జగామ యదాలక్ష్మీ ర్గజభుక్తకపిత్థవత్. 123

తా. సంపద వచ్చునపుడుకొబ్బరికాయలోనికి నీరువచ్చినట్లు కనబడకుండనే వచ్చును. అదిపోవునపుడు ఏనుఁగు తిన్న వెలగకాయలోని గుజ్జువలెనే కనఁబడకుండఁ బోవును.

శ్లో. నేక్షేతోద్యన్త మాదిత్యం నాస్తంయాన్తంకదాచన,
నోపసృష్టం నవారిస్థం నమధ్యం నభసో గతమ్. 124

తా. ఉదయించుచున్న సూర్యుని, అస్తమించుచున్న సూర్యుని, ప్రతిసూర్యుని, నీఁటగనపడినసూర్యుని ఆకాశమధ్యమమునున్న సూర్యుని ఎప్పుడును జూడరాదు.

శ్లో. నలఙ్ఘయేద్వత్సతన్త్రీం నప్రధావేచ్చ వర్షతి,
నచోదకే నిరీక్షేత స్వంరూప మితిధారణా. 125

తా. లేఁగదూడను గట్టినత్రాడు దాటరాదు. వాన కురియు చుండఁగాఁ బరుగెత్తరాదు. నీటిలో తన ప్రతిబింబమును జూచుకో రాదు. ఇవి తప్పక జ్ఞాపకముంచుకో వలయును.

శ్లో. నాశ్నీయాద్భార్యయా సార్ధం నైనామీక్షేతచాశ్నతీమ్,
క్షువతీంజృమ్భమాణాంవా నచాసీనాంయథాసుఖమ్. 126

నాఞ్జయన్తీం స్వకేనేత్రే నచాభ్యక్తా మనావృతామ్,
నపశ్యేత్ప్రసవన్తీంచ తేజస్కామో ద్విజోత్తమః. 127

తా. తనకు తేజస్సు కావయునను కోరికగల బ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ భుజింపరాదు. భార్య భుజించుచుండఁగా తుమ్ముచుండఁగా ఆవులింపు చుండఁగా సుఖముగ నొక చోటునఁ గూర్చుండియుండఁగా కన్నులకు కాటుక పెట్టుకొను చుండఁగా అభ్యంగనము చేసుకొను చుండఁగా దిగంబరయై యుండఁగా ప్రసవించుచుండఁగా జూడఁగూడదు.

శ్లో. నాన్న మద్యాదేకవాసా నన్నః స్నానమాచరేత్,
నమూత్రంపథి కుర్వీత నభస్మనినగోవ్రజే. 128

శ్లో. నఫాలకృష్టే నజలే నచింత్యాం నచపర్వతే,
నజీర్ణ దేవాయతనే నవల్మీకేకదాచన. 129.

ననసత్త్వేషుగర్తేషు। నగచ్ఛన్నాపిచస్థిదః। ననదీతీరమాసాద్యన
చపర్వతమస్తకే। వాయ్వగ్ని విప్రానాదిత్య। మపఃపశ్యం
స్తథైవగాః। నకదాచనకుర్వీత విణ్మూత్రస్యవిసర్జనమ్. 130

తా. ఒకకట్టుబట్టతో అన్నము తినరాదు. దిగంబరుఁడై స్నానముచేయరాదు. త్రోవలోను, బూడిదలోను, ఆవుల మందలోను, దున్నినచోటున, నీటిలో, చితియందు, కొండమీఁద, పాడుదేవాలయములో, పుట్టలో, జంతువులుఉండెడి గోతులలో, నడచుచు, నిలువఁబడి, ఏటియొడ్డున, కొండశిఖరముపైని, గాలికెదురుగా, అగ్నిని, బ్రాహ్మణులను, సూర్యుని, జలమును, గోవులనుజూచుచు మలమూత్ర విసర్జన చేయరాదు.

శ్లో. మూత్రోచ్చారస ముత్సర్గం దివాకుర్యా దుదఙ్ముఖః,
దక్షిణాభిముఖోరాత్రౌ సంధ్యయోశ్చ యథాదివా. 131

ఛాయాయా మంధకారే వా రాత్రావహనివాద్విజః,
యథాసుఖముఖః కుర్యా త్ప్రాణబాధాభయేషుచ. 132

తా. పగటిపూఁటను, ప్రాతః సాయం సంధ్యలయందును, ఉత్తరముఖముగాను రాత్రి దక్షిణముఖముగాను మలమూత్రముల విడువవలయును. నీడను, చీఁకటిలోను, ప్రాణసంకటము సంభవించినపుడు రాత్రియందుఁగాని పగటియందు

గాని నియమమక్కఱలేకుండ వీలునుబట్టి యేముఖముగానై
నను మలమూత్రముల విడువవచ్చును.

శ్లో. నాగ్నింముఖే నోపధమే న్నగ్నాం నేక్షేత చ స్త్రియమ్,
నామేధ్యం ప్రక్షిపేదగ్నౌ నచపాదౌ ప్రతాపయేత్. 133

తా. నోటితో నిప్పుఊదరాదు. దిగంబరయగు స్త్రీని చూడఁగూడదు. అగ్నిలో అపరిశుద్ధమగు వస్తువులు పడ వేయరాదు. నిప్పుపైని పాదములుకాచరాదు.

శ్లో. నైకఃస్వప్యా చ్ఛూన్యగేహే శయానంప్రబోధయేత్,
నోదక్యయాఽభిభాషేత యజ్ఞంగచ్ఛేన్న చావృతః. 134

తా. ఎవ్వరును లేనియింట ఒక్కఁడు నిదురించరాదు. నిద్రపోవువానిని లేపరాదు. ముట్టుదానితో మాట్లాడఁగూడదు. పిలువకుండగనే యజ్ఞమునకుఁ బోవలయును.

శ్లో. నాధార్మికే వసేద్గ్రామే నవ్యాధిబహులే భృశమ్,
నైకః ప్రపద్యే తాధ్వానం నచిరంపర్వతేవసేత్. 135

తా. ధర్మాత్ములు లేనియూరిలోను, రోగగ్రస్తమగు న్నూరిలోను నివాసముచేయరాదు. ఒక్కఁడును దారిన నడువ రాదు. కొండమీదఁను చిరకాలము ఉండరాదు.

శ్లో. ఉపానహౌచ వాసశ్చ ధృత మన్యైర్నధారయేత్,
ఉపవీతమలంకారం స్రజంకరకమేవచ. 136

తా. ఒకరు ధరించిన పాదరక్షలు, వస్త్రములు, యజ్ఞోపవీతము, అలంకారములు, పూలమాలలు, కమండలువు వీనిని మఱియొకరు ధరింపరాదు.

శ్లో. నావినీతైర్వ్రజేద్ధుర్యై ర్న చక్షుర్వ్యాధిపీడితైః,
నభిన్నశృఙ్గాక్షిఖురై ర్నవాలధివిరూపితైః. 137

తా. లొంగనివి, కన్నులరోగముగలవి, కొమ్ములువిరిగినవి, కన్నులుబోయినవి, డెక్కలుముక్కలైనవి, తోకఁకోసినవి అగుగుఱ్ఱములు, ఎద్దులు మొదలగునవి కట్టినబండి మొదలగువానిపై నెక్కికాని, వానిపై నెక్కికాని పోరాదు. వానికి పీడకలుగుటట్లుండగా తమప్రాణములకు చిక్కు కలుగును.

శ్లో. బాలాతపః ప్రేతధూమో వర్జ్యం భిన్నం తథాసనమ్,
నచ్ఛిన్ద్యాన్నఖలోమాని దన్తైర్నోత్పాటయేన్నఖాన్. 138

తా. లేతఎండ, బీనుగ పొగ, బద్దలైనపీట, విడువవలయును. గోళ్లు, వెండ్రుకలు తెంపరాదు. దంతములతో గోళ్లుకొరుకరాదు.

శ్లో. లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీచ యోనరః,
సవినాశం వ్రజత్యాశు సూచకోఽశుచిరేవచ. 139

తా. మంటిబెడ్డలు నలుపువాఁడు, గడ్డిపరకలు తెంపువాఁడు, గోళ్లుకొరుకువాఁడు, కొండెములు చెప్పువాఁడు, పరిశుద్ధిలేనివాఁడు వీరు శీఘ్రముగా నశింతురు.

శ్లో. నవిగర్హ్య కథాంకుర్యా ద్బహిర్మాల్యం నధారయేత్,
గవాంచ యానం పృష్ఠేన సర్వథైవ విగర్హితమ్. 140

తా. నింద్యమైన ప్రసంగముచేయరాదు. పారవేసినపూలదండ ధరింపరాదు. ఎద్దుమీఁద నెక్కిపోవుట అన్నివిధముల చేతను నిందింపఁదగినది. ఒక్కయీశ్వరునికిమాత్రము తప్ప

లేదఁట! ఏమందురో? ఆయన ఈశ్వరుఁడు. అనఁగా ఐశ్వర్యము కలవాఁడు. కాఁబట్టి ఐశ్వర్యవంతులు తప్పుపనిచేసినను అది ఒప్పుగానే కనుపించును. కాని, వారు చేసిరిగదా అని మనము చేయఁగూడదు.

శ్లో. అద్వారేణచ నాతీయా ద్గ్రామంవా వేశ్మవా వృతమ్,
రాత్రౌచ వృక్షమూలాని దూరతః పరివర్జయేత్॥ 141

తా. ఊరికిఁగాని, ఇంటికిగాని త్రోవమూసియున్నచో మాఱుత్రోవను వెళ్లరాదు. రాత్రియెప్పుడును చెట్టుక్రిందను గూర్చుండరాదు.

శ్లో. నస్నానమాచరే ద్భుక్త్వా నాతురో న మహానిశి,
నవాసోభిస్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే. 142

తా. భోజనానంతరము, రోగగ్రస్తుఁడైనప్పుడు, అర్ధరాత్రి, ఎల్లప్పుడును వస్త్రములతోడను, తానెఱుఁగని మడుఁగులలోను స్నానము చేయరాదు.

శ్లో. వైరిణం నోపసేవేత సహాయం చైవ వైరిణః,
అధార్మికం తస్కరంచ పరస్యైవచ యోషితమ్. 143

తా. శత్రువును, శత్రువుయొక్క సహాయుని, ధర్మము చేయనివానిని, దొంగవానిని, పరస్త్రీని ఎప్పుడును సేవింపరాదు.

శ్లో. క్షత్త్రియంచైవ సర్పంచ బ్రాహ్మణంచబహుశ్రుతమ్,
నావమన్యేతవై భూష్ణుః కృశానపి కదాచన. 144

తా. వృద్ధిలోనికి రాఁదలచినవాఁడు రాజును, పాము ను, చదువుకొన్న బ్రాహ్మణుని, చిక్కినవానిని, ఒకప్పుడును అవమానించరాదు.

శ్లో. సత్యంబ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమ ప్రియమ్। ప్రియంచ నానృతంబ్రూయా। దేష ధర్మస్సనా తనః। భద్రంభద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వావదేత్.

తా. నిజము చెప్పవలెను. ఇష్టముగాఁ జెప్పవలెను. అప్రియమైన సత్యము చెప్పరాదు. ప్రియమైనను అనృత మాడ రాదు. ఇవి అనాదినుండియు వచ్చుధర్మములు. భద్రమనఁగా శుభము. కావున ఒకనికి ప్రియము పలుకునపుడు " భద్రం భద్రం " అనిపలుకవలయును.

శ్లో. శుష్కవైరం వివాదంచ నకుర్యాత్కేనచిత్ సహ. 146

తా. ఎవనితోడను నిష్ప్రయోజనముగా విరోధించ రాదు. లేనిపోని వివాదము చేయరాదు.

శ్లో. హీనాఙ్గా నతిరిక్తాఙ్గాన్ విద్యాహీనాన్ వయోధికాన్, రూపద్రవ్యవిహీనాంశ్చ జాతిహీనాంశ్చ నాక్షిపేత్. 147

తా. హీనాంగులను, బలిసిన వారలను, చదువు లేని వారిని, ముసలివారిని, రూపములేనివారిని, ధనములేనివారిని, జాతితక్కువవారిని ఆక్షేపించరాదు.

శ్లో. శ్రద్ధధానః శుభాంవిద్యా మాదధీ తావరాదపి, అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి. 148

తా. శ్రద్ధగలిగి మంచివిద్యను తక్కువ జాతివానియొద్ద నైనను గ్రహింపవచ్చును. ఉత్తమధర్మమును చండాలుని యొద్దనైనను గ్రహింపవచ్చును. దుష్కులము నుండియైనను స్త్రీరత్నమును గ్రహింప వచ్చును.

శ్లో. విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితమ్,
అమిత్రా దపిసద్వృత్త మమేధ్యా దపికాఞ్చనమ్. 149

తా. అమృతమును విషమునుండియైనను, మంచిమాట బాలకుని వలననైనను, మంచినడవడి శత్రునివలనైనను, బంగారము అపవిత్రమైనదానినుండియైనను గ్రహింపవచ్చును.

శ్లో. స్త్రియోరత్నా న్యథో విద్యా ధర్మ శ్శౌచం సుభాషితమ్,
వివిధానిచ శిల్పాని సమాధేయాని సర్వతః. 150

తా. స్త్రీలు, రత్నములు, విద్య, ధర్మములు, పరిశుద్ధత, మంచిమాట, వివిధములగు శిల్పములు, వీనిని ఎచ్చటనున్నను గ్రహింపవచ్చును.

శ్లో. హీనజాతిం స్త్రియంమోహా దుద్వహన్తో ద్విజాతయః,
కులాన్యేవ నయం త్యాశు ససన్తానాని శూద్రతామ్.151

తా. బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు వీరుమోహవశమున తక్కువజాతిస్త్రీని పెండ్లియాడినేని వారికిగలిగిన సంతతితోఁగూడ వారి మొదటికులముల శూద్రత్వమును బొందించిన వారగుదురు.

శ్లో. యద్యత్పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్,
యద్యదాత్మవశంతుస్యా త్తత్తత్సేవేత యత్నతః. 152

తా. పరాధీనమైనపని వీలయినంతట విడుచుకోవలెను. తనఆధీనమైన పని యొంతప్రయత్నించియైనను చేయవచ్చును.

శ్లో. సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్,
ఏతద్విద్యా త్సమాసేన లక్షణంసుఖదుఃఖయోః. 153

తా. పరాధీనమైనదంతయు దుఃఖమే. స్వాధీనమైనదంతయు సుఖమే. ఇదియే సుఖదుఃఖములకు సంక్షేపమైన లక్షణమని తెలియందగును.

శ్లో. అద్రోహేణచ భూతానా మల్పద్రోహేణవా పునః,
యావృత్తిస్తాం సమాస్థాయ విప్రోజీవేదనాపది. 154

తా. బ్రాహ్మణుండు ఆపదలేని వేళను భూతములకు ద్రోహము చేయకుండనుండు వృత్తిచేతంగాని చేసినను స్వల్ప ద్రోహముచేతగాని జీవింపవలయును.

శ్లో. ఋతా మృతాభ్యాం జీవే త్త మృతేన ప్రమృతేనవా,
సత్యానృతాభ్యా మపివా నశ్వవృత్త్యాకదాచన. 155

శ్లో. ఋతముఞ్ఛశిలో జ్ఞేయ మమృతం స్యా దయాచితమ్,
మృతంతు యాచితం భైక్షం ప్రమృతం కర్షణంస్మృతమ్.
సత్యానృతంతు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే,
నశ్వవృత్తిర్నచాభ్యాసే త్తస్మాత్తాం పరివర్జయేత్. 156

తా. ఇండ్లలో ఱోళ్ల మొదటం బడినగింజల నేఱుకొని జీవించుట ఉంఛమనంబడును. మళ్లలోంబడిన వెన్నులు తెచ్చుకొని జీవించుట శిలమనబడును. ఈరెంటికిని ఋతమనిపేరు.

అమృతమనగా యాచించకుండ, యదృచ్ఛాలబ్ధమైన ద్రవ్యముచే జీవించుట. మృతమనఁగా యాచనవలన లభించిన ద్రవ్యముచే జీవించుట. ప్రమృతమనఁగా కృషి. సత్యానృతమనఁగా వర్తకము. శ్వవృత్తిఅనగా సేవ (నౌకరీ) ఇందు బ్రాహ్మణునకు వెనుకఁ జెప్పిన ఒక్కొక్కవృత్తికంటె ముందుచెప్పిన ఒక్కొక్కవృత్తి శ్రేష్ఠము. గనుక ఉంఛవృత్తి మొదలుకొని వాణిజ్యమువఱకును జెప్పఁబడిన వృత్తులచే జీవింపవచ్చును. గాని బ్రాహ్మణుఁడు శ్వవృత్తి దాస్యముచేత నౌకానుకప్పుడును జీవింపరాదు.

శ్లో. విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాంతు వీర్యతః
వైశ్యానాం ధాన్యధనదః శూద్రాణా మేవ జన్మతః. 157

తా. బ్రాహ్మణులలో జ్ఞానము గలవాఁడును, రాజులలో బలముగలవాఁడును, వైశ్యులలో ధనధాన్యములుగలవాఁడును, శూద్రులలో వయస్సుమీఱిన వాఁడును, పెద్దఅగును.

శ్లో. విత్తం బన్ధు ర్వయః కర్మ విద్యా భవతి పఞ్చమీ,
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్. 158

తా. ధనము, బంధుత్వము, వయసు, కర్మము, విద్య ఈ యైదును గౌరవింపఁదగినవి. ఇవి పూర్వము కంటె ఉత్తరోత్తరము శ్రేష్ఠము. అనఁగా ధనముకంటె బంధుత్వము, దానికంటె వయస్సు, దానికంటె కర్మము, దానికంటె విద్యయు శ్రేష్ఠము. కాఁబట్టి విద్యావంతునికంటె అందఱును తక్కువయని తెలిసికోఁదగును.

శ్లో. విద్యానామనరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తంధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః,
విద్యా బన్ధుజనో విదేశగమనే విద్యా పరాదేవతా
విద్యా రాజసుపూజ్యతే నహిధనం విద్యావిహీనః పశుః.

తా. విద్యయే మంచిరూపము. రహస్యముగా దాఁచుకొన్న ధనము. భోగములను, కీర్తిని, సుఖమును కలుగఁజేయునది విద్యయే. విద్యయే గురువులకుఁగూడ గురువు. పరదేశమునందు విద్యయే బంధువు. విద్యయే పరదేవతవలె రక్షించును. విద్య రాజులచేతఁ బూజింపఁజేయును. విద్యకన్న నధికమైనధనమే లేదు. అట్టివిద్య లేనివానిని పశువని చెప్పవచ్చును.

శ్లో. క్షాన్తిశ్చే త్కవచేనకింకిమరిభిః క్రోధోఽస్తిచే ద్దేహినాం
జ్ఞాతిశ్చే దనలేన కిం యది సుహృద్దివ్యౌషధైఃకింఫలమ్,
కిం సర్పైర్యది దుర్జనాఃకిముధనైర్విద్యాఽనవద్యా యది
వ్రీడాచేత్కిము భూషణైఃసుకవితా యద్యస్తిరాజ్యేనకిమ్.

తా. ఓర్మిఉన్నచో కవచమక్కఱలేదు. కోపమున్నచో వేరుగాశత్రువులక్కరలేదు. జ్ఞాతియున్నచో వేఱెనిప్పుఅక్కఱలేదు. మంచిస్నేహితులున్నచో దివ్యమైనమందువలన నేమిలాభము? దుర్జనులను జేరదీసికొన్న యెడల మఱిసర్పములు వేఱేఅక్కర లేదు. దోషరహితమగు విద్యగలదేని ధనముతో ప్రయోజనమేమి? సిగ్గుఉన్న యెడల నగ లెందులకు? మంచి కవిత్వమే యున్న పక్షమున ఈరాజ్యముతోఁ గొంచెమును ప్రయోజనము లేదు. అనఁగా అయాపనుల నవ్వియే చేయునని భావము.

శ్లో. దాక్షిణ్యం స్వజనే దయాపరజనే శాఠ్యంసదాదుర్జనే
ప్రీతిస్సాధుజనేన యో నృపజనే విద్వజ్జనే చార్జవమ్,
శౌర్యంశత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా
యేచైవంపురుషాః కలాసుకుశలా స్తేష్వేవ లోకస్థితిః. 161

తా. తనవారియందు దాక్షిణ్యము, పరజనులయందు దయ, దుర్మార్గులవిషయమై కపటము, సాధువులయందు ప్రేమ, రాజులయెడనీతి, విద్వాంసులయందు నిష్కాపట్యము, శత్రువులవిషయమై శౌర్యము, గురువులయందు ఓరిమి, స్త్రీలవిషయమై ప్రగల్భత గలిగి నడచుకొను విద్యయందు ప్రావీణ్యము గలపురుషులే లోకజ్ఞానము గలవారు.

శ్లో. జాడ్యంధియో హరతి సిఞ్చతి వాచిసత్యం
మానోన్నతిందిశతి పాపమపాకరోతి,
చేతఃప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సఙ్గతిః కథయ కిం నకరోతి పుంసామ్. 162

తా. సత్పురుషుల సహవాసము బుద్ధిమాంద్యమును పోఁగొట్టును. యథార్థమును పలికించును. గౌరవమును గలుగఁజేయును. పాపమును దొలఁగించును. మనస్సునకునిర్మలమునుఁ గలుగజేయును. అంతటను కీర్తివ్యాపింపఁజేయును. పురుషులకు దేనిని గలుగచేయదు. అనఁగా సత్సహవాసము వలనఁ గలుగనిది లేదు.

శ్లో. దౌర్మన్త్ర్యాన్నృపతి ర్వినశ్యతి యతి స్సఙ్గాత్సుతోలాలనా,ద్విప్రోఽనధ్యయనా త్కులంకుతనయాచ్ఛీలంఖలో

పాసనాత్ । ప్రీర్మద్యా దనవేక్షణా దపికృషిః స్నేహః ప్రవాసాశ్రయా । న్మైశ్రీ చాప్రణయాత్సమృద్ధిరనయా త్త్యాగాత్ప్రమాదాద్ధనమ్. 163

తా. దుష్టమంత్రివలన రాజు, సంగమము వలన సన్యాసి, మంచి మాటలాడుటవలన కొడుకు, చదువమిచే బ్రాహ్మణుడు, చెడుకొడుకువలన కులము, దుర్మార్గులసహావాసమువలన మంచిస్వభావము, మద్యపానమువలనసిగ్గు, చూడకపోవుటచే కృషి, పరదేశ గమనమువలన స్నేహము, ప్రీతిలేమిచే మైత్రి, నీతిలేకపోవుట వలన సంపద, త్యాగమువలనను ప్రమాదమువలనను ధనము నశించునుగాన నిట్టివి కూడవని భావము.

శ్లో. దానంభోగో నాశ స్తిస్రోగతయో భవన్తివిత్తస్య
యోనదదాతి నభుఙ్క్తే తస్యతృతీయాగతిర్భవతి. 164

తా. ధనమునకు దానమని, భోగమని నాశమని మూడుగతులు కలవు. కావున ఒకరికీయక తాను అనుభవింపక కూడఁబెట్టువాని ధనమునకు నాశమేకలుగును.

శ్లో. యస్యాస్తివిత్తం సనరః కులీన స్సపండితః సశ్రుతవాన్ గుణజ్ఞః, సఏవవక్తా సచదర్శనీయః సర్వేగుణాః కాఞ్చనమాశ్రయన్తి. 165

తా. ధనవంతుఁడే మంచి కులములోఁ బుట్టినవాడు. వాఁడేపండితుడు, వాఁడే శాస్త్రజ్ఞుఁడు, వాఁడే చూడదగినవాఁడు, వాఁడేమంచివక్త, వాఁడే గుణవంతుఁడు, ఏమనగా

అన్ని గుణములును ధనము నాశ్రయించి యుండును. అనఁగా నెన్ని యున్నను ధనము లేకపోయినచో శోభింపవు.

శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలంకృతోఽపిసన్,
మణినా భూషితః సర్పః కిమసౌనభయంకరః. 166

తా. ఎంతచదువుకొన్నను దుర్మార్గుఁడయినచో పరిహరింపవలయును. ఏమనఁగా, మణిచే నలంకరింపఁబడిన పాము భయమును గలుగఁజేయదా ? ఏఁడునులజ్జే.

శ్లో. జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతరతే దమ్భః శుచౌకైతవం
శూరేనిర్ఘృణతా మునౌ విమతితా దైన్యం ప్రియాలాపిని,
తేజస్వి న్యవలిప్తతా ముఖరతా వక్తర్యశక్తిఃస్థిరే
తత్కోనామగుణోభవేత్సగుణినాం యోదుర్జనైర్నాఙ్కితః.

తా. దుర్జనుఁడు సజ్జనులయందలి మంచి గుణములను దుర్గుణములుగానే చూచును. ఎట్లనఁగా, సిగ్గుగలవానిని జడుఁడనియు, వ్రతములయందాసక్తిగలవానిని దాంభికుండనియు, శుచియగు వానిని కపటియనియు, శూరుని దయలేనివాఁడనియు, మననము చేసికొనువానిని మతిలేనివాఁడనియు, తేజశ్శాలిని గర్విఅనియు, బాగుగా మాటలాడ నేర్చినవానిని ప్రేలువాఁడనియు, స్థిరుని శక్తిలేనివాఁడనియుఁ జెప్పుచుండును. అనఁగా దుర్జనుల యెదుట నెట్టిమంచిగుణమును బనికి రాదు.

శ్లో. లోభశ్చే దగుణేన కిం పిశునతా యద్యస్తికిం పాతకై
స్సత్యం చేత్తపసాచకింశుచిమనో యద్యస్తి తీర్థేన కిమ్,

సౌజన్యంయదికిం బలేన మహిమా యద్యస్తికిం మండనైః
సద్విద్యా యదికిం ధనైరపయశో యద్యస్తికిం మృత్యునా.

తా. లోభితనముకన్న దుర్గుణము, కొండెములు చెప్పుటకన్న పాపము, సత్యముకన్న తపస్సు,శుచి యగుమనస్సుకంటె తీర్థము, సౌజన్యముకన్న బలము, మహిమకన్న అలంకారము, మంచి విద్యకన్న ధనము, అపకీర్తికన్న మృత్యువును లేవు.

శ్లో. ఏతే సత్పురుషాః పరార్థఘటికాఃస్వార్థాన్ పరిత్యజ్యయే
సామాన్యాస్తు పరార్థముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీమానుషరాక్షసాఃపరహితంస్వార్థాయనిఘ్నన్తియే
యేతుఘ్నన్తి నిరర్థకం పరహితం తేకేనజానీమహే. 168

తా. తమకార్యములను మానుకొని పరులకార్యములు బాగుచేయువారు ఉత్తములు. తమకార్యములు చెడకుండనితరులకార్యములు బాగుచేయువారు మధ్యములు, తమ పనులకైయితరుల కార్యములు చెఱపువారు మనుష్యులలో రాక్షసులు (నీచులు.) కాని, నిరర్థకముగా పరుల కార్యములు చెఱుపువా రెవ్వరో చెప్పుటకు వీలులేదు.

శ్లో. పద్మాకరందినకరోవికచం కరోతి చన్ద్రోవికాసయతికైరవచక్రవాళమ్, నాభ్యర్థితో జలధరోఽపిజలందదాతి। సన్తః స్వయం పరహితే విహితాభియోగాః 169

తా. సూర్యుఁడు పద్మములను, చంద్రుఁడు కలువలను వికసింపఁ జేయుచున్నారు. కోరకయున్నను మేఘము వర్షించుచున్నది. కాఁబట్టి మంచివారెప్పుడును తమంతట తామే ఇతరులకు మేలుచేయ సిద్ధముగానుందురని భావము.

గజభుజంగవిహంగమబంధనంశశిదివాకరయోర్గ్రహపీడనమ్,
మతిమతాంచవిలోక్యదరిద్రతాంవిధిరహోబలవానితిమేమతిః

తా. ఏనుఁగులు, పాములు, పక్షులు ఇవి కట్టుపడుట. చంద్రుఁడు, సూర్యుఁడు రాహుకేతువులచేఁ బీడింపఁబడుచుండుట, బుద్ధిమంతులు దారిద్ర్యము ననుభవించు చుండుటయుఁ జూడఁగా విధి బలీయమైనదని తోఁచుచున్నది.

శ్లో. నైవాకృతిః ఫలతి నైవకులంనశీలం। విద్యాఽపినైవనచయ
త్నకృతాఽపిసేవా। భాగ్యాని పూర్వతపసాఖలుసంచితాని।
కాలేఫలన్తి పురుషస్య యథైవవృక్షాః. 171

తా. సౌందర్యముగాని, కులముగాని, మంచిస్వభావముగాని, విద్యగాని, ప్రయత్న పూర్వకముఁగా జేసిన సేవగాని యివి యేవియు ఫలమును గలుగఁజేయలేవు. పూర్వజన్మ సుకృతమువలన అదృష్టము సమయము వచ్చినప్పుడు చెట్టుఫలించినట్లు ప్రతిపురుషునకు ఫలించుచుండును.

శ్లో. త్యజ దుర్జనసంసర్గం భజ సాధుసమాగమమ్,
కురుపుణ్యమహోరాత్రం స్మరనిత్య మనిత్యతామ్. 172

తా. దుర్జనసహవాసమువిడువుము. మంచివారిని సేవింపుము. రాత్రింబగళ్లుపుణ్యమును జేయుము. దేహమనిత్యమనితలఁచుము.

శ్లో. ముఖంప్రసన్నం విమలాచదృష్టిః।కథానురాగోమధురాచ
వాణీ। స్నేహోధికఃసంభ్రమదర్శనంచ। సదాఽనురక్తస్య జ
నస్యలక్షణమ్. 173

తా. నవ్వుమొగము, చల్లనిచూపు, కథలయందనురాగము, తీయనిపలుకు, అధికస్నేహము, తొందరగాఁజూచుట ఇవి రాగముగలదన్నందులకు లక్షణము.

శ్లో. అతుష్టిదానం కృతపూర్వనాశనం। విమాననం దుశ్చరితానుకీర్తనమ్। కథాప్రశంసేనచ నామవిస్మృతిః స్వరక్తభావస్య జనస్యలక్షణమ్. 174

తా. దొరకినవానిచేఁ దృప్తిలేకుండుట, వెనుకటిమేలుమఱచుట, అవమానపఱచుట, చెడుపనులే యెత్తిపొడుచుట, మాటలాడుచునె మఱొకథోరణిలోనికి దింపుట, విరక్తులలక్షణము.

శ్లో. గోభిర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిస్సత్యవాదిభిః
అలుబ్ధైర్దానశీలైశ్చ సప్తభిర్ధార్యతే మహీ. 175

తా. గోవులు, బ్రాహ్మణులు, వేదములు, పతివ్రతలు సత్యవాదులు, లోభములేనివారు, దానముచేయు స్వభావము గలవారు ఈయేడుగురిచేతనే భూమి ధరింపఁబడుచున్నది. అనగా నిప్పటికిని వీరుండనిచో భూమి పాతాళములోనికి క్రుంగియే పోవును.

శ్లో. అస్థిరం జీవనంలోకే అస్థిరం ధనయౌవనమ్,
అస్థిరం దారపుత్రాది ధర్మఃకీర్తిర్ద్వయం స్థిరమ్. 176

తా. జీవనము, ధనము, యౌవనము, దారపుత్రాదులు ఇవిఅన్నియు నెప్పటికిని స్థిరమైనవి కావు. ధర్మము, కీర్తి ఈరెండే స్థిరమైనవి.

శ్లో. లోకఃపృచ్ఛతి సద్వార్తాం శరీరే కుశలంతవ,
కుతః కుశల మస్మాక మాయుర్యాతి దినేదినే. 177

తా. నీకుక్షేమమా? అనిసామాన్యముగా ఒకరినొకరు అడుగుచుందురు; గాని మనకు దినదినమును ఆయువు తరిగి పోవుచుండఁగా నింక నేటికుశలము ?

స మా ప్త ము.

# ఏలూరు, రామా అండ్ కో వారి
# ఎలిమెంటరీ పాఠశాలల గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | శిశుతరగతి నాటకముల కథలు | | (అప్రువుడు) | ... | 0-2-0 |
| 2 | మొదటితరగతి | ,, | డిటో | ... | 0-2-6 |
| 3 | రెండవతరగతి | ,, | డిటో | ... | 0 3-0 |
| 4 | మూడవతరగతి | ,, | డిటో | ... | 0-4-0 |
| 5 | నాల్గవతరగతి | ,, | డిటో | ... | 0 4 6 |
| 6 | ప్రభుభక్తికీర్తనలు, పద్యములు | | | ... | 0-1-0 |
| 7 | సుదతీసునీతిశతకము-బాలికలకు తేలికగుపద్యములు | | డిటో | | 0-1-3 |
| 8 | సివిక్సుమ్యాన్యుయల్. 3, 4, తరగతులకు | | డిటో | ... | 0-5 0 |
| 9 | కిండరుగార్టెనుడ్రిల్లు. | (బొమ్మలతో) | డిటో | ... | 0 5 0 |
| 10 | నూతనగంజాముజిల్లాభూగోళము. | | డిటో | ... | 0-3-0 |
| 11 | నూతనవిశాఖపట్టణముజిల్లాభూగోళము | | డిటో | ... | 0 3 0 |
| 12 | నూతనగోదావరిజిల్లాభూగోళము. | | డిటో | ... | 0-3-0 |
| 13 | నూతనకృష్ణాజిల్లాభూగోళము. | | డిటో | ... | 0-3-0 |
| 14 | నూతనగుంటూరుజిల్లాభూగోళము | | డిటో | ... | 0-3 0 |
| 15 | నూతననెల్లూరుజిల్లాభూగోళము | | డిటో | ... | 0-3-0 |

ఈక్రింది గ్రంథములు డైరెక్టరుగారికి అప్రువుకొరకు పంపడమైనది.

| | | | | |
|---|---|---|---|---|
| 16 | నూతనకర్నూలుజిల్లాభూగోళము | | ... | 0-3-0 |
| 17 | నూతనకడపజిల్లాభూగోళము | | ... | 0-3-0 |
| 18 | నూతనబళ్ళారిజిల్లాభూగోళము | | ... | 0-3-0 |
| 19 | నూతనఅనంతపురముజిల్లాభూగోళము | | ... | 0-3 0 |
| 20 | నూతనచిత్తూరుజిల్లాభూగోళము | | ... | 0-3-0 |
| 21 | నూతనచెంగల్పట్టుజిల్లాభూగోళము | | ... | 0-3-0 |
| 22 | మృగముల డ్రాయింగుబుక్కు | | ... | 0-2-6 |
| 23 | పక్షుల డ్రాయింగుబుక్కు | | ... | 0-2-6 |
| 24 | శిశుతరగతికథలు. | (నాటకములేనివి) | ... | 0-1-0 |
| 25 | మొదటితరగతికథలు. | ,, | ... | 0-1-0 |
| 26 | రెండవతరగతికథలు. | ,, | ... | 0-1-0 |
| 27 | మూడవతరగతికథలు. | ,, | ... | 0-1-0 |

## ఇతరగ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | మోక్షగుండరామాయణము (హరికథ) (తా॥ నా॥ కవి) | 1-12-0 |
| | డిటో కాలికోబైండు ... | 2-4-0 |
| 2 | బహార్యోత్తరఖండము (హరికథ) ... | 1-0-0 |
| 3 | గయోపాఖ్యానము- కా॥ వీరమల్లయ్యగారు. ... | 0-8 0 |
| 4 | శ్రీమనోబ్జభాస్కరము. ... | 0-6-0 |
| 5 | అజీర్ణహారమంజరి 0-4 0 (6) భజనకీర్తనలు ... | 0-8 0 |
| 7 | శివభజనకీర్తనలు 0-2-6 (8) వెంకటేశ్వరసాక్ష్యము | 0-0-6 |
| 9 | గానలోలశతకము [తిరుమలేశశతకమువలె] ... | 0-1-0 |
| 10 | కోడండ్లమీాటింగు (అత్తలనుగూర్చి) ... | 0 2-0 |
| 11 | దైవకృప 0-2-0 (12) తమాలపాకు పోక చెక్కసంవాదము | 0-0-6 |
| 13 | వేదాంతశిరోభూషణము ... | 0-3-0 |
| 14 | జ్ఞానవతీవిలాపము. (వాతలువేయబడిన చిన్నదానిచరిత్రము) | 0-0-9 |
| 15 | భాషీయగండకము. (అన్నిభాషలు హాస్యముగనుండును.) | 0-1-0 |
| | నెల్లూరు టక్కరి 0-2-0 నెల్లూరు నెరజాణ | 0-2-0 |
| | హాస్యరసమైన వృద్ధబ్రాహ్మణప్రయాణము ... | 0 1-0 |
| | హైజినిక్ ఫిజియాలజి మొదటిభాగము స॥ కామేశ్వరరావు | 1-4-0 |
| | డిటో రెండవభాగము స॥కా. డిటో | 1-4-0 |
| | రామాయణసార నాటకము ... | 0-4-0 |
| | రామాయణసారము వచనము ... | 0-8-0 |
| | భారతసారము వచనము ... | 0-8 0 |
| | భీష్మునిచరిత్రము వచనము ... | 0-8-0 |
| | పర్వదినమహాత్మ్యము ... | 0-4-0 |
| | నీతిశాస్త్రము అర్థముతో ... | 0-2-0 |
| | దాశరథి శతకం డిటో ... | 0-4-0 |
| | బాలరామాయణం డిటో ... | 0-2-0 |
| | శ్రీనీతిదర్పణము—బాలికలకు చక్కనినీతులు ... | 0-0-6 |

పోష్టు కర్చులు కొనువారే భరించవలెను.

వలయువారు:—రామా అండ్ కో., ఏలూరు.

RAMA PRESS, ELLORE